



శ్రీ చాంద్రమాన ఖరనామ సంవత్సర

# శ్రీభాస్కర పంచాంగమ్

## SRI BHASKARA PANCHANGAM (Telugu)

*for the year "KHARA" (2011-2012 AD)*





Almanac-maker : "Jyoutisha Sarvabhouma"
**Pandit ANNAPARTY KRISHNA SHARMA Siddhanti**

Published by : ADITHYA JYOTHISHALAYAM ASSOCIATION
11-20-14/206, HUDA Complex, Saroor Nagar, HYDERABAD - 500 035.

పంచాంగకర్త : జ్యౌతిష సార్వభౌమ **బ్ర॥ శ్రీ॥ అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి**

పబ్లిషర్స్ : ఆదిత్య జ్యోతిషాలయం అసోసియేషన్
11-20-14/206, హుడా కాంప్లెక్స్, సరూర్‌నగర్, హైదరాబాద్ - **500 035.**

✆ : 6457 5218, 2404 4759, Mob : 9885 442568

***50th Golden Jubilee Issue*** **50వ స్వర్ణోత్సవ పంచాంగము** వెల రూ. 25

## OUR GRATEFUL THANKS

To the Director, Shri Sanjiv Sen, Positional Astronomy Centre, Kolkata, Government of India, for providing us the necessary Astronomical Data for preparation of this Panchang. Accordingly, the timings of Tithi, Nakshatras etc. and rising-setting-retrogression of the Planets, Eclipses of the Sun and the Moon given in this Panchang agree with those shown in the Rashtriya Panchang and the Indian Astronomical Ephemeris.

**Hyderabad** **– Pandit Annaparty Krishna Sharma "Siddhanti"**
Date : **1-3-2011** Mobile: **98854-42568**

## పంచాంగకర్త దంపతులు



బ్ర॥శ్రీ॥ అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాంతి గారు శ్రీమతి పార్వతీదేవి

పరమహంస పరివ్రాజక శ్రీశ్రీ చిదానంద భారతీస్వాములవారు, శ్రీ శృంగేరీ విరూపాక్షీయ శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులు, శ్రీ చిదానందాశ్రమము, గన్నవరం - 521 102, (కృష్ణా జిల్లా) తమ 10-4-2001 శ్రీముఖము ద్వారా శ్రీ అన్నపర్తి కృష్ణశర్మ సిద్ధాన్తి గారికి "జ్యౌతిష సార్వభౌమ" అను బిరుదము ననుగ్రహించినారు.

శ్రీ శర్మగారు గురువుల ఆశీస్సులచే దీర్ఘాయుష్మంతులై అనేక జ్యోతిష, సిద్ధాన్త గ్రంథములను రచించి, పంచాంగకర్తలకు, జ్యోతిష్కులకును మార్గ దర్శకులు కాగలరని ఆశించుచున్నాము.

**ఆదిత్య జ్యోతిషాలయం అసోసియేషన్**

*వేదమంటే శబ్దం. శబ్దం ఒకటే, ధ్వనులు వేరు.*



## శ్రీ ఖరనామ సంవత్సర భాస్కర పంచాంగ వివరణము (2011-2012 AD)

ఈ పంచాంగము, గత 49 సంవత్సరముల నుండి ప్రచురింపబడుచు విశేష ప్రజాదరణను పొందియున్నది. ప్రస్తుతము యీ **ఖర** సంవత్సర శ్రీభాస్కర పంచాంగములో అనేక నూతనాంశములు చేర్పబడినవి.

ఈ పంచాంగము నవీన దృగ్గణిత రీత్యా, భారత ప్రభుత్వము వారిచే ఆమోదింపబడిన శకమానముతో, భారత కాలమానపు గంటలు, నిమిషము లలో వ్రాయబడినది. ఉదయము గం॥ 5-30 ని॥ల నుండి తిథి, నక్షత్ర, యోగ, కరణముల సమాప్తి కాలములు, వర్జ్యము యొక్క ఆద్యంతములును పట్టికలో చూపబడినవి. "వ్రతాది విశేషములు" అను శీర్షికలో సహస్రాధిక ముగా పండుగలు, వ్రతములు, పుణ్యకాలములు, సెలవు దినములు, జయంతులు, పుణ్యతిథులు, ఆరాధనలు, ఉత్సవములు మొదలగునవి వ్రాయబడినవి. ప్రభుత్వము వారి సెలవు దినములే గాక, ఇస్లాము, క్రిష్టియను మతములకు సంబంధించిన మాసారంభ దినములు, పండుగలును వ్రాయబడినవి.

చైత్రాది ద్వాదశ మాసములకు అశ్విన్యాది కార్తెలకును ప్రత్యేకముగ వర్షయోగాది ఫలితాంశములే గాక, గ్రహముల పాదచారములు, దైనందిన లగ్నసారణియును ప్రదర్శింప బడినవి.

**పంచాంగ వివరణము** : 1. తిథి, 2. వారము, 3. నక్షత్రము, 4. యోగము, 5. కరణము - వీనిని **పంచాంగము** అందురు. తిథి వలన శ్రేయస్సు, వారము వలన ఆయుస్సు, నక్షత్రము వలన పాపక్షయము, యోగము వలన రోగ నివారణము, కరణము వలన కార్యసిద్ధియు కల్గునని చెప్పబడినది.

**వేదములు, కర్మకాండ :** వేదములోని పూర్వభాగమంతయు కర్మాచరణను విధించును. అట్టి కర్మలు కాలవిశేషము నాశ్రయించి అనుష్ఠింపదగినవి. ఆయా కాల విశేషములను దెలుపునది జ్యోతిశ్శాస్త్రము. ఈ కర్మార్హ కాల విశేషములు జ్యోతిశ్చలనము వలన గలుగును. జ్యోతిస్సులనగా : 1. సూర్య చంద్రులు (బింబ గ్రహములు), 2. కుజాది పంచ (తారా) గ్రహములు, 3. మందోచ్చలు, 4. విలోమగతికల పాతలు, 5. నక్షత్రములు. ఈ పంచవిధ జ్యోతిస్సుల చలనము వలన కాలవిశేషము లేర్పడుచున్నవి.

*అన్ని ఒకటిగా గుర్తించేవాడు జ్ఞాని; అన్నీ తానైనవాడు దైవం.*

**ఈ కాల విశేషములు :** 1. ప్రజాపతిలోకము, 2. బృహస్పతిలోకము, 3. దేవలోకము, 4. పితృలోకము, 5. మనుష్యలోకము నను నైదు లోకముల కును సంబంధించియున్నవి. కావుననే, మనుష్యలోకమున శాస్త్రోక్త కాలములం దనుష్ఠింపబడిన యాగాది కర్మలందలి హవ్య కవ్యములు తత్తల్లోకవాసులగు దేవతలకు సంక్రమించుట వలన, మనుజులకు ఇహపర సౌఖ్యములు లభించుచున్నవి. ఇట్టి విషయ పంచకముతో నొప్పు పంచాంగము ప్రతి గృహస్థునింట నుండవలయును.

**కాలస్వరూపము :** కాలము పరబ్రహ్మ స్వరూపము. ఇది రెండు విధములు : ఒకటి సంహారాత్మకమైనది. రెండవది కలనాత్మకమైనది. ఈ కలనాత్మకమైన కాలము స్థూలము, సూక్ష్మము అని మఱల రెండు విధములు. కల్పములు, మన్వంతరములు, యుగములు, సంవత్సరములు మొదలగునవి స్థూల కాలము. రెప్పపాటు కంటె తక్కువ గల కాలమును సూక్ష్మకాల మందురు.

**సంవత్సర కాల విభాగము :** కాల విభాగములో సంవత్సర కాలము అత్యంత ప్రాముఖ్యము గలది. సంవత్సరమునకు అయనములు రెండు : 1. ఉత్తరాయణము, 2. దక్షిణాయనము. సంవత్సరమునకు ఋతువులు ఆఱు. ఋతువునకు మాసములు రెండు. మాసమునకు పక్షములు రెండు - శుక్లపక్షము, కృష్ణపక్షము. పక్షమునకు వారములు రెండు. వారమునకు దినములు ఏడు. దినమనగా అహోరాత్రము - పగలు, రాత్రి. పగలు, రాత్రికి రెండేసి పూటలు. పూటకు జాములు రెండు. జామునకు గంటలు మూడు. దినమునకు 24 గంటలు లేదా 60 గడియలు. సంవత్సరములో లెస్సగా నిమిడిన కాలస్వరూపము తిథి, వార, నక్షత్రాదులతో గూడినదై పంచాంగము నందు ప్రదర్శింపబడును.

## పంచాంగము చూచు పద్ధతి

పంచాంగము మానవులకు శుభాశుభ ఫలములను సూచించుచున్నది. ప్రతి మాసమునందును తదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి అన్ని పనులకు శుభప్రదమైనవి; చవితి, నవమి, చతుర్దశి మంచివి కావు. వారములలో బుధ, గురు, శుక్రవారము ఉత్తమమైనవి. మంగళవారము క్రూరమైనది. యోగములలో శూల, పరిఘ, వ్యతీపాత, వైధృతి యోగములు కూడనివి. కరణములలో విష్టికరణము చెడ్డది. ఇదే విధముగా నా యా





కార్యములకు తగిన నక్షత్రములను గూడ చూచుకొనవలసి యున్నది. శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిథి - వార - నక్షత్రాదులను ప్రత్యేకముగా నిర్ణయించుకొనవలెను. వర్జ్యమనగా వర్జింపదగినదని అర్థము. **వర్జ్యకాలము జప, పూజా, ధ్యానాదికము నకు మంచిది.** సాధారణముగా రాహు కాల మశుభము, గుళిక కాలము శుభము. రాహుకాలము యాత్రా వివాహాదు లందు వర్జింపదగినది.

**సంవత్సరములు 60 :** వాని పేర్లు - ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోద, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాథి, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్, శోభకృత్, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృత్, పరీధావి, ప్రమాది, ఆనంద, రాక్షస, నళ, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ. వీనికి నారద సంతానమని జగత్ప్రసిద్ధి కలదు.

**ఋతువులు 6 :** అవి - వసంత, గ్రీష్మ, వర్ష, శరత్, హేమంత, శిశిర ఋతువులు.

**మాసములు 12 :** అవి - చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము. మాసములు, ఋతువులు, సంవత్సరములును సూర్యచారము వలన నేర్పడుచున్నవి.

**తిథులు 30 :** అవి 1. శుక్లపక్షమున - పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ, 2. కృష్ణపక్షమున - పాడ్యమి, విదియ, ...... చతుర్దశి, అమావాస్య. శుక్ల పక్షమునే శుద్ధ పక్షమనియు, కృష్ణ పక్షమునే బహుళ పక్షమనియు వ్యవహరింతురు. విధులను తెలుపునవి తిథులు - ఇవి బ్రహ్మ స్వరూపము.

**వారములు 7 :** అవి - ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము. ఈ వారములకు

ప్రతివారములు : భాను వాసరము, ఇందు వాసరము, భౌమ వాసరము, సౌమ్య వాసరము, బృహస్పతి వాసరము, భృగు వాసరము, మంద వాసరము. 'సంకల్పము' చెప్పునపుడు ప్రతివారములు చెప్పవలెను.

**నక్షత్రములు 27 :** అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పూర్వఫల్గుని (పూ.ఫ.), ఉత్తరఫల్గుని (ఉ.ఫ.), హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ (పూ.షా.), ఉత్తరాషాఢ (ఉ.షా.), శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర (పూ.భా.), ఉత్తరాభాద్ర (ఉ.భా.), రేవతి. ఇవన్నియు దక్ష ప్రజాపతి కుమార్తెలని చెప్పబడినది.

**యోగములు 27 :** విష్కంభము, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్య, శోభన, అతిగండ, సుకర్మ, ధృతి, శూల, గండ, వృద్ధి, ధ్రువ, వ్యాఘాత, హర్షణ, వజ్ర, సిద్ధి (అసృక్), వ్యతీపాత, వరీయాన్, పరిఘ, శివ, సిద్ధ, సాధ్య, శుభ, శుక్ల (శుక్ర), బ్రాహ్మ, ఐంద్ర, వైధృతి యోగములు. ఇవి విష్ణు స్వరూపములు.

**కరణములు 11 :** చర కరణములు ఏడు - బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణిజి, విష్టి (భద్ర). స్థిర కరణములు నాలుగు - శకుని, చతుష్పద, నాగవ, కింస్తుఘ్నములు. ఇవన్నియు శివ స్వరూపములు.

సంవత్సర ఋతు, మాస, తిథ్యాదుల పేర్లు అనేక గ్రంథకర్తల చేతను కొందఱు పంచాంగకర్తలచే గూడ అపభ్రంశముగ వాడబడుచున్నవి. ఉదా : జ్యోతిషం, జ్యోతిష్యుడు, రాసి, రాశులు, ఉచ్ఛ, జ్యేష్ఠమాసం, ఆశ్వీజం, ఆశ్వీయుజం, కార్తీకం, ఫాల్గుణం, అశ్వని, అరుద్ర, మఖ, జ్యేష్ట, గురుడు, అరుణగ్రహం, శనీశ్వరుడు, గ్రహసంచారం, నిర్బీజ రవి చంద్రులు, గ్రహ నయనం, నిరయనము, నిరాయణము, ఘడిలు, నిముషము, చతుష్పాత్ (యోగము), యమగండం, ఆశౌచము, మేలాపకం, శుభముహూర్తం, అశుభ శకునం, బ్రహ్మ(యోగం), మిథునం, ధనస్సు, ఉ.షాఢ, ఉ.భాద్ర, హిమవంత ఋతువు, కాలశాస్త్రం, గ్రహశాస్త్రం, మహర్దశ - యీ విధముగా సంప్రదాయ విరుద్ధంగా వాడబడుచున్నవి. కాని, యీ పంచాంగములో శాస్త్రీయపదములు శుద్ధముగ వ్రాయబడినవి.





# ప్రాక్ పశ్చిమ గ్రహగణిత సిద్ధాన్త భేదములు

నేటికాలమున పలురకములైన పంచాంగములు ప్రచారములో నున్నవి. పూర్వకాలమున మనదేశమునందు పంచాంగములు ఒకే గణితపద్ధతిపై ఆధారపడియుండుటచేత, దేశ భేదమువలన శాస్త్రీయముగ వచ్చునట్టి దేశాంతర తిథ్యాదులుతప్ప, గ్రహగణిత పద్ధతిలో భేదము యేమాత్రమును లేకుండెడిది.

పాశ్చాత్య దేశస్థుడైన గెలీలియో 'దూరదర్శన యంత్రము'ను (టెలిస్కోపు) కనిపెట్టిన తర్వాతను, న్యూటను (క్రీ.శ. 1642-1727) గతిసూత్రములను (న్యూటన్సు లాస్ ఆఫ్ మోషన్) వ్రాసిన తర్వాతను, వేఱొక (గ్రహ)గణిత పద్ధతి వెలసినది. దీనినే "నవీన గ్రహగణితము" (మాడరన్ ఆస్ట్రనామికల్ ఎఫిమెరీస్) అనుచున్నారు. దీనికి నాందీప్రస్తావన చేసిన ఖగోళశాస్త్రజ్ఞుడు "కోపర్నికస్" (క్రీ.శ. 1543).

పాశ్చాత్యులు శాస్త్రీయ, సాంకేతిక రంగములందు సాధించిన అభివృద్ధిని గాంచిన కొందరు భారతీయ "సిద్ధాంతులు" (గ్రహ గణితవేత్తలైన పంచాంగ కర్తలు) వారి నాగరికతచేతను, విజ్ఞానముచేతను ప్రభావితులై, గ్రహ గణితమును గూడ పాశ్చాత్య గణితపద్ధతి ననుసరించి చేయుచున్నారు. ప్రాచీనమైన ఆర్షగణిత పద్ధతిననుసరించి సాధించిన సూర్యాదిగ్రహములకు, పాశ్చాత్య గ్రహగణిత పద్ధతిననుసరించి సాధించిన గ్రహములకు స్ఫుటములో (గ్రహస్థానములో) భేదముండును. అట్టి భేదమును నవీన గణితానీత గ్రహములతో సరిపోవునట్లు కొందరు సిద్ధాంతులు సవరించుచున్నారు. ఈ భేదమునకు "బీజము" అనియు, ఇట్టి సవరణను "బీజ సంస్కారము" అనియు పేర్లు పెట్టినారు. ఈ బీజసంస్కార గ్రహములకు నవీన గ్రహగణిత రీత్యా నక్షత్ర వేధశాలల సాయముతో పాశ్చాత్య ఖగోళశాస్త్రజ్ఞులు సాధించునట్టి గ్రహములకు తేడా ఉండదు (అయనాంశ తప్ప). బీజసంస్కారము చేసి, గ్రహములను సాధించి పంచాంగ రచన చేయు పద్ధతికి "దృగ్గణిత పద్ధతి" అని పేరు.

కాఁబట్టి పైని వివరించినట్లు మన భారతదేశములోనే పూర్వపద్ధతి పంచాంగములనియు, దృగ్గణిత పంచాంగములనియు రెండు రకముల పంచాంగములు వాడుకలోనికి వచ్చినవి.

ఇవిగాక మూడవరకపు పంచాంగమొకటి యున్నది. పాశ్చాత్యులు సాధించునట్టి నవీన గణితానీత గ్రహములు "సాయన గ్రహములు" అనఁబడును. స+అయన, సాయన-అయనముతోఁ గూడిన గ్రహములు సాయన గ్రహములు. సాయన గ్రహములలో యీ అయనమును (అయనాంశలను) తీసివేసిన నిరయనగ్రహము లగును. ఇట్టి నిరయన గ్రహములవలన కొందఱు సిద్ధాంతులు పంచాంగములను తయారుచేయుచున్నారు. **ఇది నిరయన గణిత పద్ధతి**. ఇది కేవలము పాశ్చాత్యులు సాధించిన సాయన గ్రహములపై (ట్రాపికల్ లాంజిట్యూడ్స్) ఆధారపడి యున్నది. మనదేశములో బహుళ ప్రచారములోనున్న "లాహిరీ ఎఫిమెరీస్" యీ కోవకు చెందినది.

సారాంశమేమనగా : గణితపద్ధతిననుసరించి ప్రస్తుత కాలమున మన దేశమున ప్రచారములోనున్న పంచాంగములను మూడు తరగతులుగ విభజింపవచ్చును. అవి: 1. పూర్వపద్ధతి పంచాంగములు, 2. దృగ్గణిత పంచాంగములు, 3. నిరయన పంచాంగములు. వాస్తవముగ దృగ్గణిత పంచాంగములు, నిరయన పంచాంగములు ఒకే కోవకు చెందినవి.

**1. దృగ్గణిత పంచాంగములు :** ఇవి బీజసంస్కార పద్ధతిపై ఆధారపడి యున్నవి. బీజసంస్కారమనగా : మధ్యగ్రహములో కొన్ని వికలలు (మినిట్స్ ఆఫ్ ఆర్క్) కలిపి గాని, తీసివేసి గాని సంస్కరించుట. బీజసంస్కారమును కాలనుగుణముగ కొన్ని వందల సంవత్సరములకొకమారు మార్చవలసి యుండును. ఇట్టి బీజసంస్కారమువల్ల కల్పాంతమునందు గ్రహగణితము తప్పును. అదెట్లనఁగ: సృష్ట్యారంభమున ప్రారంభమైన గ్రహచారము కల్పాంతమునకే ముగియును. కల్పాంతకాలమున మధ్యగ్రహమే స్ఫుట గ్రహమగుటచేత ఈ మధ్యకాలమున గ్రహమునకు అనేకమార్లు బీజ సంస్కారములు చేయుటవలన, కల్పాంతమున మధ్యగ్రహము స్ఫుట గ్రహము కాజాలదు. కాఁబట్టి, లెక్క చివర ఆన్సరు (ఉత్తర్వు) తప్పు అయినట్లు, గ్రహగణితము కల్పాంతమున తప్పుటయేగాక, యీ మధ్యకాలమున గూడ గ్రహగణితము నిర్దుష్టము కాజాలదు. అందుచేత దృగ్గణిత పంచాంగములు ప్రామాణికములు గావు.

**2. నిరయన పంచాంగములు :** నవీన గ్రహగణిత పద్ధతి చాల జటిలమైనది. ప్రస్తుతము గణిత మహాయంత్రముల ద్వారా (కంప్యూటర్లు) సాయన





గ్రహములను సాధించి పాశ్చాత్యదేశములందు పుస్తకములుగా ప్రచురించుచున్నారు. "రాఫేల్ ఎఫిమెరీస్" ఈ కోవకు చెందినది. ప్రస్తుతకాలమున భారతప్రభుత్వమువారు "ఇండియన్ ఆస్ట్రనామికల్ ఎఫిమెరీస్" పేరిట ఒక సాయన గ్రహగణిత గ్రంథమును ఏటేట ప్రచురించుచున్నారు. వాస్తవముగ గ్రహగణిత పద్ధతి తెలియనివారు కూడ, ఈ సాయన గ్రహముల నుండి "అయనాంశ" తీసివేసి, నిరయనగ్రహములుగ మార్చుకొని, వానినిబట్టి పంచాంగములను తయారుచేయుచున్నారు.

"క్యాలెండర్ రిఫారమ్సు కమిటీ" వారి నిర్ణయానుసారము, భారత ప్రభుత్వమువారు, 1957 సంవత్సరమునుండి, జాతీయ క్యాలెండరు నొకదానిని ప్రవేశపెట్టి, 13 భాషలలో ఏటేట "రాష్ట్రీయ పంచాంగము"ను ప్రచురించుచున్నారు. "క్యాలెండర్.రిఫారమ్సు కమిటీ"లోని సభ్యులు చాలామంది పాశ్చాత్య గ్రహ గణిత విధానముపై వ్యామోహము గలవార లగుటచే తదనుగుణముగ ఐతరేయ బ్రాహ్మణము మొదలగు వైదిక గ్రంథ ప్రామాణ్యములను జూపి, సాయన గ్రహగణితమే అనుసరణీయమని నిర్ణయించి సర్దుబాటు ధోరణిలో ఒక పంచాంగ పద్ధతిని రూపొందించి, పైన చెప్పినట్లు "రాష్ట్రీయ పంచాంగ"మను పేర ప్రకటించుటకు గవర్నమెంటు వారికి సిఫారసు చేసియున్నారు.

పూర్వపద్ధతి పంచాంగములకు, దృగ్గణిత-నిరయన పంచాంగములకు ఆధారమైన సూర్యాది గ్రహ స్ఫుటములలో వ్యత్యాసము లుండుట చేత తిథి-నక్షత్రాదుల ప్రారంభ, సమాప్తికాలములు, వ్రతములు, పండుగల నిర్ణయములు, సంక్రమణ కాలములు, సంవత్సరారంభ దినములు, రాజాది నవనాయకులు, అధికమాస క్షయమాసములు మొదలగువాని నిర్ణయములో గూడ భేదములు వచ్చుచున్నవి. అందుచే ఆస్తికులగు గృహస్థులు, సామాన్య ప్రజానీకము ఏ పంచాంగము అనుసరణీయమో తెలియక సంశయగ్రస్తు లగుచున్నారు. ప్రభుత్వమువారు గూడ ప్రజాభిప్రాయము ననుసరించి ఆయా సెలవు దినములను మార్చిమార్చి ప్రకటించుచున్నారు. పూర్వపద్ధతి పంచాంగములకు దృగ్గణిత-నిరయన పంచాంగములకు అధిక క్షయ మాసములు, ఉగాదిపండుగ ఇతర పండుగలలో వ్యత్యాసములు వచ్చినపు డెల్ల ప్రజలు పూర్వపద్ధతినే బలపరచి తదనుగుణముగ ఆచరించుచున్నారు. దీనివల్ల సంప్రదాయము ఎంత బలీయమో తెలియుచున్నది.

## పూర్వపద్ధతి పంచాంగములు - సూర్యసిద్ధాంతము

పూర్వపద్ధతి పంచాంగములన్నియు మహర్షిప్రోక్త గ్రంథములపై ఆధారపడియున్నవి. జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకులైన మహర్షులు పదునెనమండ్రు (18). వారందఱు తమతమపేరున ఒక్కొక్క "సిద్ధాంతగ్రంథము"ను (గ్రహ గణిత విధానమును తెలుపునట్టి గ్రంథమును) వెలయించిరి. వారెవరనఁగా:

శ్లో. సూర్యః పితామహో వ్యాసో వసిష్ఠోఽత్రి పరాశరాః ।
నారదః కశ్యపో గర్గో మరీచి ర్మను రంగిరాః ॥
లోమశః పౌలిశ శ్చైవ చ్యవనో యవనో గురుః ।
శౌనకోఽష్టాదశహ్యేతే జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః ॥

సూర్యుడు, బ్రహ్మ, వ్యాసుఁడు, వసిష్ఠుఁడు, అత్రి, పరాశరుఁడు, నారదుఁడు, కశ్యపుఁడు, గర్గుఁడు, మరీచి, మనువు, అంగిరసుఁడు, లోమశుఁడు, పౌలిశుఁడు, చ్యవనుడు, యవనుఁడు, గురువు, శౌనకుఁడు. సూర్యునిపేర "సూర్యసిద్ధాంతము", బ్రహ్మపేరిట "బ్రహ్మసిద్ధాంతము" - ఈ విధముగ ఆయా కాలములందు జిజ్ఞాసువుల కొఱకును, శాస్త్ర పునరుద్ధరణము కొఱకును మహర్షులు సిద్ధాంత గ్రంథములను రచించి, ప్రచారముచేసి యున్నారు. ఈ గ్రంథములు వెలువడిన కాలభేదమేగాని, వీనియందు గణితభేదము లేదు. పైన చెప్పఁబడిన సిద్ధాంత గ్రంథములన్నియు ఇపుడు మనకు లభించుట లేదు. ఒక్క సూర్యసిద్ధాంత గ్రంథము మాత్రమిపుడు సమగ్రముగ లభించుచున్నది.

రామాయణగ్రంథములలో వాల్మీకిరామాయణము ప్రమాణమైనరీతిగ పైని పేర్కొనిన సిద్ధాంత గ్రంథములలో "సూర్యసిద్ధాంతము" సూర్యునిచే స్వయముగా మయున కుపదేశింపఁబడి, గ్రహగణితపద్ధతికి పరమప్రమాణమై జగత్ప్రసిద్ధమై యున్నది. పూర్వపద్ధతి పంచాంగము లన్నియు యీ సూర్య సిద్ధాంత గ్రంథమునందుఁ జెప్పఁబడిన గ్రహగణిత పద్ధతిపై ఆధారపడి యున్నవి. పంచాంగరచనకు ఆధారమైన యీ సూర్యసిద్ధాంత గ్రంథము నందు పదునాలుగు (14) అధ్యాయములలో : భూగోళ, ఖగోళ, బ్రహ్మాండ గోళములకు సంబంధించిన అత్యద్భుత విషయములు, జ్యోతిషశాస్త్ర రహస్యములును ఉన్నవి. మధ్యగ్రహములను సాధించు రీతి, గ్రహ స్ఫుటీకరణము, సూర్యచంద్రగ్రహణ గణితము, గ్రహముల ఉదయాస్తమయ





గణితము మొదలగునవి ఎన్నియో కలవు. ఆధ్యాత్మిక విద్యకు **భగవద్గీత** వలె, జ్యోతిషవిద్యకు యీ **సూర్యసిద్ధాంత గ్రంథము** పరమ ప్రమాణమైనది. "సూర్యసిద్ధాన్తము" అనునది గ్రంథము పేరనికూడ తెలియని కొందఱు సూర్య సిద్ధాన్తమగనగా 'సౌరమానము' అని భ్రమపడుచున్నారు. మానములు తొమ్మిది కలవు: అవి సౌరమానము, చాంద్రమానము, సావనమానము, నాక్షత్రమానము మొదలైనవి. చాంద్రమానము ఆంధ్ర, కర్ణాటక, బెంగాలు, పంజాబు మొదలగు రాష్ట్రములలో వాడుకలో నున్నది. సౌరమానము ద్రవిడదేశము (తమిళనాడు)లోను, మరికొన్ని ప్రాంతములలోను వాడుకలో నున్నది. యథార్థ మిట్లుండగా: సూర్యసిద్ధాంతపంచాంగ మనగా సౌరమాన పంచాంగమని కొందఱు పురోహితులుగూడ తలంచుట మిక్కిలి శోచ నీయము. ఇదీ మన శాస్త్రములకు పట్టిన దుస్థితి : ప్రకృత మనుసరింతము.

**అయనాంశలు** : పాశ్చాత్యులు గుణించిన సాయన గ్రహములనుండి అయనాంశలు తీసివేయగా వచ్చిన నిరయన గ్రహములను బట్టి కొందఱు పంచాంగములు తయారుచేయుచున్నారని పైని తెలిపియుంటిమి. అయనాంశ యొక్క విలువ మారుచుండుటయేగాక, అయనాంశల నిర్ణయములో గూడ నేటికాలమున నిరయన పంచాంగకర్తలకు ఏకాభి ప్రాయము కుదురుట లేదు. ఒక్కొక్కరు ఒక్కొక్క పద్ధతి ప్రకారము అయనాంశలను గ్రహించుటచేత, నిరయన పంచాంగములందు ఒకదాని లోని గడియలకు మరియొకదానిలోని గడియలకు చాల వ్యత్యాసములు వచ్చుచున్నవి. తదనుగుణముగ ఫలితాంశములో తేడాలు వచ్చుచుండును. అయనాంశ విలువలో ఒక భాగ (డిగ్రీ) తేడా ఉన్నచో శుక్రమహాదశయందు ఒకటిన్నద సంవత్సరము తేడా వచ్చును. అంతేగాక పూర్వపద్ధతి పంచాంగము ప్రకారము తయారుచేసిన జాతకమునకును, అదే జననకాలమునకు దృగ్గణిత - నిరయన పంచాంగముల ప్రకారము తయారుచేసిన జాతకమునకును, జన్మనక్షత్రమున పాదభేదము కూడ వచ్చుచున్నది. ఉదాహరణకు : పూర్వ పద్ధతి పంచాంగము ననుసరించి ఒక జాతకమున జన్మనక్షత్రము ఆశ్లేష మూడవపాదముకాగా దృగ్గణిత-నిరయన పంచాంగముల ననుసరించి ఆశ్లేష రెండవ పాదమైనది.

అయన చలనము విషయమై, "త్రింశత్కృత్యా యుగే భానాం, చక్రం ప్రాక్పరిలంబతే" అని సూర్యసిద్ధాంతమునందు చెప్పబడినది.

### ఆధునిక గణితము

ఆధునిక గ్రహగణితమువల్ల గ్రహచారములు, సూర్య-చంద్ర గ్రహణ, గ్రహోదయాస్తమయాదులు ప్రత్యక్ష పరీక్షణములకు సరిపోవుచున్నవి. ఏ గణిత పద్ధతి అనుభవమునకు సరిపోవుచున్నదో, అదే సరియైన గణిత పద్ధతి. అందుచేతనే నాసా (NASA), ఇస్రో (ISRO) కేంద్రాలనుండి ప్రయోగింపబడిన ఉపగ్రహములు (శాటిలైట్స్) ప్రత్యక్ష సిద్ధములై, ఫలప్రదములై 'ఆధునిక గణితము' (Modern calculations) నికరమైనదని ఋజువు చేయుచున్నవి. అట్లు కానిచో, అంతరిక్షమునకు వెళ్ళిన మానవుడు సురక్షితముగ నిర్ణీత సమయమున, నిర్ణీత ప్రదేశమున (సముద్రపుటొడ్డున, సముద్రములో కాదు!) దిగుట సంభవింపదు.

### ఆధునిక గణితపు విశిష్టత

పూర్వపద్ధతి కంటె, ఆధునిక గ్రహగణిత పద్ధతి నికరమైనదని పైన తెలిపియుంటిమి. కాలానుగుణముగ గణిత సంస్కారము చేయవలసి యుండుట చేతనే, వేర్వేరు కాలములందు అనేక సిద్ధాంత-తంత్ర-కరణ గ్రంథములు, బీజసంస్కారములును వాడుకలోనికి వచ్చినవి : యుగభేదాత్ కక్ష్యాభేదః, కక్ష్యాభేదాత్ గతిభేదః, గతిభేదాత్ కాలభేద ఇత్యలమ్ ॥

కావున, చెప్పవచ్చినదేమన : పంచాంగకర్తలందఱు ఒక పరిషత్తుగా నేర్పడి, తమ తమ పంచాంగాలలో కనీసము తిథి-నక్షత్ర-యోగ-కరణ సాధనకై గణిత సామ్యమును పాటించినచో, ఆస్తికులకు సమాజమునకును మేలు చేసినవారగుదురు. "న బుద్ధిభేదం జనయేత్" అనినారు కదా శంకర భగవత్పాదులు! **అ.కృ.శ.**

### బ్ర॥శ్రీ అన్నపర్తి కృష్ణశర్మ గారు రచించిన గ్రంథములు

| | | | రూ. |
|---|---|---|---|
| 1. | జ్యోతిష బాల బోధిని | ... | 50/- |
| 2. | దేవీ పూజా కల్పము | ... | 25/- |
| 3. | సూర్య సిద్ధాన్తము (ప్రథమ సంపుటి) | ... | 100/- |
| 4. | ముహూర్త పారిజాతము | ... | 50/- |
| 5. | జ్యోతిష విజ్ఞాన చంద్రిక | ... | 100/- |

**పరిమితమైన శక్తి మనస్సు; అపరిమితమైన శక్తి ఆత్మ.**



# జ్యోతిశ్శాస్త్రము - హేతువాదము

మానవుడు ఆశాజీవి. ముందు ముందు మంచి రోజులు వస్తాయని, తన కష్టాలు తీరిపోతాయని, తన మనోరథం సిద్ధిస్తుందని ఆశిస్తుంటాడు. అంటే భవిష్యత్తు మీద ఆశలు పెట్టుకుంటాడు, ఆశలు పెంచుకుంటాడు. ఆశ లేనిదే జీవితమే లేదు. ఇది జీవన సత్యం.

తాను ఎంత ప్రయత్నించినా, తనకు తెలియని ఏదో శక్తి అడ్డు తగులుతూ ఉంటుంది. ఆ శక్తినే కొందరు దైవం అంటారు; మరికొందరు విధియని; 'బ్యాడ్‌లక్' అని అంటుంటారు. కొందరు మాత్రము ఈ విఘ్నాలను లెక్కచేయకుండా రాబర్టు బ్రూస్‌వలె మళ్ళీ మళ్ళీ ప్రయత్నించి, చివరకు కార్యసిద్ధిని పొందగలుగుతారు. భర్తృహరి కూడ ఈ విధంగా సుభాషితం చెబుతాడు :

'తనిసిరే వేల్పు లుదధి రత్నములచేత,
వెఱచిరే ఘోరకాకోల విషము చేత' - *(ఏనుగు లక్ష్మణకవి)*

అనగా దేవతలు అమృతము కొరకు పాల సముద్రమును మథించునపుడు మొదట వచ్చిన రత్నములచేత తృప్తిపడలేదు, తరువాత బయల్వెడలిన కాలకూట విషమునకు కూడ భయపడక అమృతభాండము వచ్చు వరకు ప్రయత్నించినారు. ఈ విధముగా కార్యసిద్ధి కలగడానికి పురుషప్రయత్నము నకు దైవసహాయము కావలసి వుంటుంది.

అయితే సగటు మానవుడు తన జీవిత సముద్రాన్ని మథించి అమృతాన్ని పుట్టించుకోలేడు. తాను పోయిన తరువాత ఏమౌతుందో అని విచారించడు కాని బ్రతికినన్నాళ్ళు తాను, తన కుటుంబము హాయిగా వుండాలని కోరుకుంటాడు. సంసారి అయినవాడు ఫలవృక్షము వలె దెబ్బలను, కష్టాలను తప్పించుకోవాలని చూస్తాడు; కాని సన్యాసి ఎండు కట్టెవలె (చెట్టు) అన్నిటికి సిద్ధపడతాడు, దేనిని లెక్కచేయడు - వారి సంగతి అలా వుంచండి. ప్రస్తుతం గృహస్థుల సంగతికి వద్దాం. తెలివిగల రైతు, అదను తెలుసుకొని తొలకరి వానలు రాగానే విత్తనాలు చల్లి వ్యవసాయం చేస్తాడు. అకాలంలో విత్తనాలు చల్లిన రైతుకు పంట రాకపోవుటయే గాక విత్తనాలు గూడ నష్టపోతాడు. ఇది ప్రకృతిసిద్ధమైన విషయం. అంటే

**పురాణమంటే జరిగినదాన్ని చెప్పటం**

ఫలసాయం ఋతుధర్మాలమీద, ప్రకృతిమీద ఆధారపడి వుంటుంది. స్త్రీలకు గూడ ఋతుధర్మానుసారం గర్భధారణ జరుగుతుంది. దీనిని నేటి శాస్త్రజ్ఞులు ప్రకృతి లేక నేచర్ అంటున్నారు; దీనినే మన పూర్వులు, ఆధ్యాత్మికం లేక దైవం అన్నారు.

మానవ ప్రయత్నం ఫలించటానికి, మానవాతీతమైన ఒకానొక శక్తి లేదా దైవం తోడు కావాలని పైన పేర్కొన్నాము. ఆ దైవాన్నే జ్యోతిశ్శాస్త్రంలో గ్రహాలు అంటారు. సూర్యచంద్రాది గ్రహాలు, నక్షత్రాలు దైవం కంటే వేరు కాదని, దైవము యొక్క విరాట్ స్వరూపమని శాస్త్రాలు చెబుతున్నాయి. గ్రహాల నడక వల్లనే ఋతువులలో హెచ్చుతగ్గులు వస్తున్నాయని, భూకంపము, క్షామము, గాలివానలు, రాళ్ళవానలు, ఈతిబాధలు వస్తున్నాయని జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలలో చెప్పబడినవి. మనిషి జన్మించిన సమయాన్ని బట్టి అంటే జననకాలము నందలి గ్రహస్థితిని బట్టి అతను ఎన్ని సంవత్సరములు జీవించేది, ఏ రకంగా వృత్తి వుద్యోగాలు, పదవులు నిర్వహించేది, భార్య-సంతానము, గృహనిర్మాణము ఏ వయస్సులో జరిగేది మొదలైన అనేక విషయాలు తెలుస్తాయి. దీనినే జాతకశాస్త్రమంటారు. ఈ పై విషయముల నన్నింటినీ ముందుగా తెలుపునదే భవిష్యత్‌పురాణము. దీనిని వ్యాసభగవానులు సంస్కృతములో వ్రాసినారు. దీనినే 'కాలజ్ఞాన' మనే పేరుతో బ్రహ్మంగారు తెలుగులో వ్రాసినారు.

అన్నిటికీ కాలం ప్రధాన మంటారు. ఈ కాలం ఒక చక్రం లాంటిది. ఈ చక్రభ్రమణంలో క్రింది యాకు (కమ్మి) మీదికి, మీదియాకు క్రిందికి వస్తుంటుంది. అంటే "జయంట్‌వీల్"లో వున్నవారి వలె, క్రింద నున్నవారు పైకీ, పైన వున్నవారు క్రిందికి వస్తుంటారు. జ్యోతిషశాస్త్రంలో దీనినే "జాతక చక్రము" అంటారు. జననకాల సమయము, తేదీ, జన్మప్రదేశమును బట్టి జాతకచక్రము తయారుచేస్తారు. జనన కాలిక గ్రహస్థితిని బట్టి ఆ వ్యక్తి జన్మించినప్పటి నుండి మరణించు వరకు జరిగే శుభాశుభ ఫలితాలను జాతకశాస్త్రరీత్యా చెప్పుటకు వీలు అవుతుంది. అంతేకాకుండా జన్మచక్రాన్ని బట్టి వారి వారి స్వరూప స్వభావాలు, అభిరుచులు, ఇష్టాయిష్టాలు తెలియును. తరచుగా వ్యక్తి యొక్క ఇష్టాయిష్టాలకు, అభిరుచులకు భిన్నంగా వారి జీవితంలో అనుకోని సంఘటనలు జరిగి, జీవితం మలుపులు





తిరుగుతుంది. దీనికి కారణం వెనుక చెప్పినట్లు దైవం లేక గ్రహాలు అంటారు. అందువలన దాదాపు మానవులందరు భవిష్యత్తుపై ఆశలు పెంచుకుంటారు. అంటే తాము తలచిన విధంగా జరుగుతుందా? తమ మనోరథాలు సిద్ధిస్తయ్యా? అని ప్రశ్నించుకుంటారు. అంతే కాకుండా, రెండు సమాన అవకాశాలు వచ్చినపుడు భవిష్యత్తులో తమకు ఏది శ్రేయస్కరమో తెలియగోర్తారు. జరిగిన సంఘటనలను గురించి విచారము కంటే జరగవలసిన దానిని (భవిష్యత్తును) గురించి మానవుడు జాగ్రత్తపడాలని కోరుకుంటాడు. అంటే **భవిష్యత్తు దైవం లాంటిది.**

జాతకశాస్త్ర రీత్యా భవిష్యత్తు తెలుస్తుంది. ఒక విధంగా చూస్తే, మానవ జీవితం సమస్యల తోరణం. కొందరికి జీవితంలో చాలాకాలం సుఖంగా జరుగుతుంది. మరికొందరికి చిరకాలము కష్టాలు, బాధలే వుంటాయి. బాధలకు కారణాలు మారుతుంటాయే గాని, బాధలు వరుసగా వుంటూనే వుంటాయి. మన కళ్లెదుట బాగా బతికినవాళ్ళూ ఉన్నతపదవులు అలంకరించిన వాళ్ళూ, హీనస్థితికి రావటాన్ని చూస్తుంటాము. అదే విధంగా పేదరికంలో పుట్టి, వారాలు చేసుకుంటూ, వీధిదీపాల క్రింద చదువుకొని, మహోన్నత స్థానాలను అలంకరించిన వారూ ఉన్నారు. కొందరు జీవితంలో గొఱ్ఱెతోక వలె ఎదుగుబొదుకు లేక, పడుతూలేస్తూ జీవయాత్ర సాగిస్తూ వుంటారు. "మంచి అన్నంలోకి మంచికూర దొరకదు" అని సామెత. ఎంతో యోగ్యురాలు, రూపవతి అయిన కన్యకు కఠినాత్ముడైన భర్త లభిస్తుంటాడు. బియ్యేలు, ఎమ్మేలు చదివి సరియైన వుద్యోగము దొరకక కూలినాలి చేసుకొని జీవనాన్ని సాగిస్తున్న వారున్నారు. మరికొందరు స్వల్పంగా చదువుకొని ధైర్యాన్ని కూడగట్టుకొని, కొద్దిలో ఏదో వ్యాపారాన్ని మొదలుపెట్టి, కోటీశ్వరులైన వారున్నారు.

ఈ పై విషయాలన్నీ పురాణాలు చదివినవారికే గాక, లోకజ్ఞానమున్న వారి కందరికి తెలిసినవే. ఈ విధమైన అసమానతలకు, అన్యాయాలకు కారణమేమిటి? ఎవరు దీనికి బాధ్యులు? దీనికి సమాధానంగా అనేక ఆధ్యాత్మిక గ్రంథాలు, వేదాంత గ్రంథాలు వెలసినాయి. కొందరు "బ్రహ్మ సత్యం, జగన్మిథ్య" అన్నారు; కొందరు జగత్తు పుట్టనే లేదన్నారు (గౌడపాదులు). జగత్తు మిథ్యే అయితే ఒక ఎకరం ఆస్తి వున్నవాడు పది

ఎకరాలు చేయాలని ఎందుకు తాపత్రయపడుతున్నాడు? ఒక లక్ష సంపాదించినవాడు నూఱు లక్షలు చేయాలనీ కోటీశ్వరుడు కావాలనీ ఎందుకు కోరుకుంటున్నాడు? ఒక వూరులో పేరు సంపాదించినవాడు, పది వూళ్ళకు నాయకుడు కావాలని, యమ్మెల్యే కావాలని ప్రయత్నిస్తుంటాడు. యమ్మెల్యేలు, యంపీలూ - మినిష్టర్లు కావాలని కోరుకుంటున్నారు. ఇదంతా జీవన పోరాటం; ప్రకృతి సహజం.

అయితే మనమనుకున్నట్లుగా జరుగదు, మనకున్నట్లుగా జరుగుతుంది. ఎవరికి ఏ విధంగా రాసిపెట్టి ఉందో ఆ విధంగా జరుగుతుంది. అయితే జాతకాలు చూపించుకోవటం దేనికి? ఈ గ్రహశాంతులు దానాలు చేయటం ఎందుకు? ఇవి చేస్తే అశుభం తొలగి, శుభాలు చేకూరుతాయని శాస్త్రంలోనే చెప్పి ఉన్నది. అంటే పురుషప్రయత్నం (మానవ ప్రయత్నం) ఉన్నదన్నమాట. 'వినా వా మానుషం దైవం, దైవం వా మానుషం వినా। సిద్ధన్తి సర్వకార్యాణి, సంయోగాత్కర్మణోర్ద్వయోః, న త్వేకస్మాత్కథంచన ॥ (బాదరాయణుడు) - అనఁగా మానవప్రయత్నం లేకుండా దైవంకాని, దైవానుకూలం లేనిదే మానవప్రయత్నం గాని ఫలించదు. ఈ రెంటి యొక్క కలయిక వల్లనే అన్ని కార్యములు ఫలిస్తవని తాత్పర్యము. దీనినే 'షడ్భాగన్తు మనుష్యాణాం, సప్తమం దైవచిన్తనమ్ ॥' అని మరొకవిధంగా చెప్పినారు. అదేమనగా: ఆఱువంతులు మానవప్రయత్నం ఏడవవంతు దైవానుకూలం అన్నారు.

మానవయత్నాన్నే, సామాన్య పరిభాషలో తాపత్రయం అంటారు. ఈ పురుషప్రయత్నం మూడు విధాలు, మూడు శక్తిరూపాలు - ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి. ఈ శక్తులే మంత్ర-తంత్ర-యంత్రాలుగా పనిచేస్తవి. నోటితో ఉచ్చరించేది మన్త్రం; గురూపదేశం లేనిదే యిది ఫలించదు. చేతితో చేసేది తంత్రం - అంటే యజ్ఞయాగాది శుభకర్మలు, శాంతికై జపదానాదులు, తీర్థయాత్రలు మొదలైనవి. యంత్రం అంటే: ధరించిన మాత్రము చేత లేదా పూజించిన మాత్రముచేత ఫలితాన్నీ, అభీష్టసిద్ధినీ యిచ్చేదన్నమాట. ఈ యంత్రాలు శాస్త్రరీత్యా నిర్దుష్టంగా తయారుచేసి, ఆయా యంత్ర దేవతలకు సంబంధించిన మన్త్రజప, పూజా, శాంతులు సక్రమంగా నిర్వహిస్తే ఫలప్రదాలౌతాయి. బావిలోని నీటిని సులభంగా తోడటానికి జలయంత్రాన్ని





ఉపయోగిస్తున్నాం. అదేవిధంగా అగాధమైన జాతకంలోని అదృష్టాన్ని అందుకోవటానికి యంత్రాలు ఉపయోగపడతాయి.

**ఇక శాంతులు** - గ్రహాలు అనుకూలంగా లేనపుడు, గ్రహాల ఆనుకూల్యం, అంటే దైవానుకూలం కొరకు శాంతులు చేయిస్తుంటారు. దీనివల్ల తప్పకుండా శుభఫలితాలు కలుగుతాయని శాస్త్రం చెబుతున్నది. అయితే యీ శాంతిజపాలు చేసేవారికీ, జ్యోతిషం చెప్పేవారికీ, శాంతులు అక్కర్లేదా అని కొందరు ప్రశ్నిస్తుంటారు. దీనికి సమాధానం, వారికి కూడా అవసరమనే. అందువల్ల జ్యోతిష్కులు కూడా ఎప్పుడు బడితే అప్పుడు జాతకఫలాలు చెప్పకూడదు; వారు కూడా తమ గ్రహబలం చూచుకొని, సమయాసమయా లెరిగి ఫలాదేశం చేయాలి. ఇది నవనాగరికతా ప్రపంచం. నేటికాలంలో హేతువాదం హెచ్చుగా కనబడుతుంది. ఎవరూ దేనిని గుడ్డిగా నమ్మటం లేదు - అంతవరకూ మంచిదే. కొందరు జ్యోతిష్కులను పరీక్షించటం కోసం ప్రశ్నిస్తుంటారు. 'మా వెండిగిన్నె ఒకటి పోయిందండీ, దొరుకుతుందా?' అని ఒకరు ప్రశ్నించారు. 'దొరుకుతుంది' అని సమాధానం చెప్పాను. 'ఇహిహీ! దొరికిందండీ' అన్నారు. 'ఐతే ఇలా చూడండీ! మళ్ళీ పోతుంది. చచ్చినా దొరకదు' అన్నాను. కాబట్టి జ్యోతిష్కులను పరీక్ష చేయటం కోసం, కాలక్షేపం కోసం ప్రశ్నించకూడదు. నిజంగా అవుసరం ఉన్నప్పుడే ఫల-తాంబూల-దక్షిణలతో వచ్చి జ్యోతిష్కుని ప్రశ్నించాలి. అది శాస్త్రపద్ధతి, సభ్యత కూడాను.

అవసరం విలువైంది. ఆరోగ్యం సరిగా ఉన్నప్పుడు ఎవరూ డాక్టరు దగ్గరకు వెళ్ళరు. అదే విధంగా జయప్రదముగా, సుఖముగా ఉన్నంతకాలం జ్యోతిష్కులతో పనిలేదు. కష్టంకాలం వచ్చినపుడు, తమ అదృష్టాన్ని పరిశీలించుకోవటానికి జ్యోతిష్కుల వద్దకు వస్తుంటారు. జ్యోతిశ్శాస్త్రానికి మరో ప్రయోజనం కూడా ఉంది. జననకాలం, జననం ఐన తర్వాత గుర్తించేది గనుక జాతకఫలాలు నిర్దిష్టంగా ఉంటాయి. కాని సుముహూర్తముల విషయంలో కాలనిర్ణయం మనం చేసుకోవటానికి వీలౌతుంది. సుముహూర్తంలో ప్రారంభించిన పనులు జయప్రదమౌతాయి. కాలం కంటికి కనబడదు గాని జరుగుతుంది. **ఈ కాలమే భగవత్స్వరూపం; గ్రహనక్షత్రాలనూ చరాచర జగత్తునూ నడిపించేది.** కంటికి కనబడని కాలాన్ని గణించి, గణితరీత్యా భవిష్యత్తును చెప్పటమే జ్యోతిషం. కొందరు తాము ఉన్నత

ఆధ్యాత్మికస్థితిని పొందినందువల్ల, తమ జాతకంలోని గ్రహాలు పనిచేయటం లేదనీ, ఆ గ్రహముల స్థితిగతులకు తాము అతీతులమని చెప్పటం నేను విన్నాను. వాస్తవానికి భూమిపై జన్మించిన వారెవ్వరూ గ్రహాలకు అతీతులు గారు. పుట్టినపుడు ఐదుగ్రహాలు ఉచ్ఛస్థితిలో ఉంటే అవతారపురుషు లౌతారు. శ్రీరాముని జాతకంలోను, శ్రీకృష్ణుని జాతకంలోను యీ విధంగా పంచగ్రహోచ్ఛలున్నాయి.

ఇక ముహూర్తాల విషయమై, వధూవరుల జాతకాలు కలిసినప్పటికీ, వివాహముహూర్తం మంచిది కావాలి. కొందరు పంచాంగాలలో వ్రాసిన ముహూర్తాలకే వివాహాలు జరిపిస్తుంటారు. కాని, ఈ ముహూర్తాలే అందరికీ వర్తించవు. వారివారి జాతకాలనుబట్టి సుముహూర్త నిర్ణయం చేయవలసి యుంటుంది. అసలు సుముహూర్తంలో వివాహం జరిపిస్తే 'విడాకుల' ప్రశ్నయే లేదు. శాస్త్రాన్ని నమ్మి ఆచరించేవారు శుభాలను పొందుతారు.

జ్యోతిశ్శాస్త్రం కల్పవృక్షం లాంటిది. ఎంతో ప్రయోజనకారి. జాతక ముహూర్త-వాస్తు-శకున-స్వప్న-ప్రశ్న-గోచార-గ్రహశాన్త్యాది అనేక శాఖలతో ఒప్పుచున్న యీ జ్యోతిష కల్పద్రుమము, మానవుల అభీష్టసిద్ధి కొరకే భూలోకమున వెలసినది. సూర్యచంద్రులే ప్రత్యక్షసాక్షులుగా గల యీ కల్పవృక్షమును జేరి అందరూ ఫలసిద్ధిని పొందవలసినదిగా కోరుచున్నాను:

శ్లో॥ **అపరోక్షాణి శాస్త్రాణి వివాదా స్తేషు కేవలమ్ ।**
**ప్రత్యక్షం జ్యౌతిషం శాస్త్రం చంద్రార్కౌ యత్ర సాక్షిణౌ ॥** **అ.కృ.శ.**

## కాలం

*కాలం అంటే... ఎన్నో కాలా లున్నాయి. అన్నింటికీ కాలమే. గణితానికీ అక్షరాలకూ కాలమే, పదాలకూ కాలమే. ఒక కాలంలో (column) వుండ వలసింది ఇంకో కాలంలో (column) ఉండకూడదు. ఆ ఒక కాలంలో ఉన్న అంకె ఇంకోకాలంలో వుంటే, దాని సంఖ్య మారుతుంది. అంతా కాలమే. అందుకే కాలం గణేశ్వరుడన్నారు. కాలం వినాయకుడన్నారు. అలా తీసుకుంటే జగత్తంతా కాలంతోనే నిండి వున్నది. గోడమీద గడియారాలు మొదలు చేసుకుని చూస్తూ, చేస్తూ, నడుస్తూ వున్నకాలం; వింటూ, అంటూ, తిరుగుతున్న కాలం, ఇవి అన్నీ కాలమే. సర్వంకాలము, ఉన్నది కాలమే. కాలం పరబ్రహ్మ స్వరూపము.*

**- జిల్లెళ్ళమూడి అమ్మ**





కాలము ప్రాణులను సృష్టించుచున్నది. కాలమే ప్రాణులను సంహరించు చున్నది. కాలము వల్లనే జనులు నిద్రించుట, మేల్కొనుట మొదలగు వ్యాపారములను (పనులను) చేయుచున్నారు. కాలము నతిక్రమించుట కెవ్వరికిని సాధ్యము గాదు. దేవతలు, రాక్షసులు, సర్పములు, రాజులు మొదలగు సర్వజంతువులు (ప్రాణులు) కాలవశముననే నశించుచున్నవి. భగవానుడగు విష్ణువు, మహేశ్వరుడు, బ్రహ్మ - వీరందఱు కాలస్వరూపులు గావున కాలులని చెప్పబడుచున్నారు.

## దైవజ్ఞ లక్షణమ్

శ్లో॥ అద్వేషీ నిత్యసంతోషీ, గణితాగమపారగః ।
ముహూర్తగుణదోషజ్ఞో వాగ్మీ కుశలబుద్ధిమాన్ ॥
శాన్త శ్చామృతవా క్సౌమ్యః, త్రికాలజ్ఞో జితేంద్రియః ।
నిత్యకర్మరతో యో వై, స దైవజ్ఞః ప్రకీర్తితః ॥

శ్లో॥ దశదినకృతదోషం హన్తి సిద్ధాన్తవేత్తా
త్రిదివసకృతదోషం తన్త్రవేత్తా నరాణామ్ ।
కరణభగణవేత్తా చైకరాత్రోత్థదోషమ్
జనయతి బహుపాపం తత్ర నక్షత్రసూచీ ॥

ఇతరులను ద్వేషింపనివాడు, ఎల్లప్పుడు సంతోషముగ నుండువాడు, గణిత శాస్త్రమును చక్కగా నెఱింగినవాడు, ముహూర్తగుణ దోషములను దెలిసినవాడు, యుక్తియుక్తముగ మాటలాడువాడు, అమృతవాక్కు (వాక్శుద్ధి) కలవాడు, తిన్ననివాడు (అక్రూరుడు), భూత భవిష్య ద్వర్తమానముల నెఱింగినవాడు, ఇంద్రియములను జయించినవాడు, సంధ్యావన్దనాది నిత్య కర్మలయం దాసక్తి కలవాడు "దైవజ్ఞుడని" చెప్పబడినది.

సిద్ధాన్త మెఱింగిన వానిని దర్శించిన, పది దినములలో చేసిన పాపము పరిహార మగును. తంత్రజ్ఞుడగు జ్యోతిష్కుని దర్శించిన, మూఁడుదినములలో చేసిన పాపమును, కరణవేత్తను దర్శించిన నొక్కదినములలో చేసిన పాపమును నశించును.

## జ్యోతిశ్శాస్త్ర ప్రశంసా

శ్లో॥ జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం, ప్రత్యక్షమపి గోపితమ్ ।
చంద్రాఽర్కౌ సాక్షిణౌ తత్ర, శ్రౌతస్మార్తాది సాధనమ్ ॥

శ్లో॥ స్కంధ త్రయాత్మకం శాస్త్ర, మాద్యం సిద్ధాన్తసంజ్ఞికమ్ ।
ద్వితీయం జాతకస్కంధం, తృతీయం సంహితాహ్వయమ్ ॥

శ్లో॥ ఛందఃపాదౌ శబ్దశాస్త్రం చ వక్త్రమ్, శిక్షా ఘ్రాణం శ్రోత్రముక్తం నిరుక్తమ్ ।
కల్పం పాణి ర్జ్యోతిషం చక్షుషీ చ, వేదస్థానా న్యాహు రేతాని షట్చ ॥

సూర్యచంద్రులు ప్రత్యక్ష సాక్షులుగా గల జ్యోతిష శాస్త్రము మహాపుణ్య ప్రదమై, రహస్యముగ నున్నది. వేదపురుషునకు ఛందస్సు పాదములు, శబ్దశాస్త్రము (వ్యాకరణము) వక్త్రము, శిక్ష నాసిక, నిరుక్తము శ్రోత్రము, కల్పము హస్తము, జ్యోతిషము నేత్రము. ఈ వేదాంగములలో జ్యోతిశ్శాస్త్రము వేద పురుషునకు నేత్ర స్థానీయమగుటచే నత్యంత ప్రాముఖ్యము వహించినది.

## పంచాంగ గణిత కేంద్రమ్

ఈ పంచాంగము భారత కాలమాన రేఖాంశ అయిన భాగాది $82^0$-30' (గ్రీనిచ్ - లండను నగరమునకు) తూర్పునకు గుణింపబడినది. కావున యీ పంచాంగములోని గంటలు, నిమిషములు **"భారత కాలమానము"** (ఇండియన్ స్టాండర్డ్ టైము)లో నున్నవని గ్రహించవలెను. ఈ భారత కాలమాన రేఖాంశ, లంకోజ్జయినీ రేఖాంశకు 67 వినాడికల దేశాంతరములో నున్నది:

శ్లో॥ లంకాపుర్యాస్తు ప్రాగ్దేశే, యత్రాఽగర్తు వినాడికాః ।
తద్భారతస్య కేంద్రస్య, పంచాంగం రవి సమ్మతమ్ ॥ (అ.కృ.శ.)

## సృష్ట్యాది గతకాల నిరూపణమ్

శ్రీ చాంద్రమాన ఖరనామ సంవత్సరమునకు సృష్ట్యాది గతకాలము నిరూపింపఁబడుచున్నది: శ్రీమదాది నారాయణ నాభికమలోద్భవస్య, పద్మజ నామకస్య, అద్యబ్రహ్మణో, ద్వితీయ పరార్థే, శ్వేతవరాహ కల్పే, షట్సు మన్వంతర గతేషు, సప్తమే వైవస్వత మన్వంతరే, అష్టావింశ న్మహాయుగే, కల్యాది గతాబ్దాః 5112.

| | |
|---|---|
| సృష్ట్యాది గతాబ్దాః | 195,58,85,112 |
| హరిశ్చంద్ర మహారాజాబ్దాః | 2,38,34,252 |
| నల మహారాజాబ్దాః | 1,36,23,959 |
| కార్తవీర్యార్జునాబ్దాః | 1,28,35,162 |
| రావణాబ్దాః | 1,25,69,112 |





| | |
|---|---|
| రామ-రావణ యుద్ధ కాలాబ్దాః | 1,25,25,112 |
| శ్రీరామచంద్ర రాజ్యాంత వత్సరాః | 1,25,14,112 |
| భరతస్య రాజ్యపాలనాబ్దాః (దుష్యన్త పుత్రః) | 5,360 |
| విక్రమార్క శకాబ్దాః | 2,068 |
| శాలివాహన శకాబ్దాః | 1,933 |
| క్రీస్తు సంవత్సరః | 2011-2012 |
| భారత స్వాతంత్ర్య వత్సరాః | 64 |

## అహర్గణము

అహర్గణ మనగా దినసంఖ్య. సృష్ట్యారంభము నుండి, 28వ మహాయుగము నందలి ద్వాపరయుగాంతము వఱకు (శ్రీకృష్ణుని యవతారసమాప్తి వఱకు) అహర్గణము 71440,22,96,627. గత షష్టి (ప్రభవాది) చక్రములు 3,25,98,000.

ఈ కలియుగము, (13వ) ప్రమాథి సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి శుక్రవారము నాడు ప్రారంభమైనది. కడచిన "అక్షయ" సంవత్సరమునకు గతషష్టి 84.8 అగుటచే, ఈ కలియుగమున నిప్పటివఱకు 85 షష్ట్యబ్ద చక్రములు పూర్తియైనవి.

వర్తమాన "ఖర" సంవత్సరము 86వ షష్ట్యబ్ద చక్రములో 25వది. ఈ ఖర సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి, సోమవారము, 4-4-2011 తేదీ, సూర్యోదయ కాలమునకు కల్యాది అహర్గణము 1867190.25, జూలియన్ దినము 2455655.5, అయనాంశ 24°-01'-08".

## అథ అబ్దత్రయ నిరూపణమ్

**1. చాంద్రమానాబ్దః :** అస్మిన్ దేశే, లోకవ్యవహారార్థం చాంద్రమానాఽబ్దో గ్రాహ్యః। చాంద్రమానేన చైత్ర శుద్ధ ప్రతిపది, ఇందువాసరే, 4-4-2011 తారికాయాం, ప్రభవాది పంచవింశత్తమ (25-వ) ఖరనామ వత్సరః ॥

**2. సౌరమానాబ్దః :** శేషాచలస్య దక్షిణదేశేషు (తమిల్‌నాడు-ద్రవిడాది) సౌర మానాఽబ్దో గ్రాహ్యః । సౌరమానేన చైత్ర శుద్ధ ఏకాదశ్యాం, బృహస్పతి వాసరే, 14-4-2011 తారికాయాం సౌర వత్సరారంభః ॥
- చాంద్ర సౌరమానాభ్యాం శ్రీ ఖరనామ వత్సరః ॥

**3. బార్హస్పత్యమానాబ్దః :** వింధ్యస్యోత్తర దిగ్భాగే సింధు, ఘూర్జరాది (గుజరాత్ మొ॥) దేశేషు బార్హస్పత్యమానాఽబ్దో గ్రాహ్యః । స్ఫుట గురోః మేషరాశి ప్రవేశ

వశాత్ (8-5-2011, గం. 14-14) ఏతత్సంవత్సర వైశాఖ శుద్ధ పంచమ్యాం, భాను వాసరే, బార్హస్పత్యమానేన శ్రీ విశ్వావసునామ వత్సరారంభః ॥

- గురూదయవశాత్ భాద్రపదాబ్దః ॥

## అథ రాజాది నవనాయకాః

అస్మిన్ వర్తమానస్య, సమస్త కల్యాణభాజనస్య, సకల శ్రౌత - స్మార్త - నిత్య - నైమిత్తిక - కామ్యకర్మానుష్ఠాన క్రియాతన్త్ర వ్యవహార హేతుభూతస్య చాంద్ర మానేన శ్రీ ఖరనామ సంవత్సరస్య :

1. రాజా చంద్రః
2. మన్త్రీ గురుః
3. సేనాధిపో బుధః
4. సస్యాధిపో రవిః
5. ధాన్యాధిప శ్శుక్రః
6. అర్ఘాధిపో బుధః
7. మేఘాధిపో బుధః
8. రసాధిప శ్చంద్రః
9. నీరసాధిపో రవిః

### చాంద్రమానేన శ్రీ ఖరనామ సంవత్సర ఫలమ్

శ్లో॥ ఖరాబ్దే నిఖిలా భూపా శ్చాన్యోన్య సమరోత్సుకాః ।
మధ్యమావృష్టి రత్యుగ్రరోగైర్భూపా లయం యయుః ॥

ఖర సంవత్సరమున రాజులు పరస్పరము యుద్ధాసక్తులై యుందురు. మధ్యమవృష్టి యుండును. రాజులు గొప్పవియగు రోగములచే నాశము బొందుదురు.

### 1. రాజ్ఞః చంద్రస్య ఫలమ్

శ్లో॥ గోధూమ శాలీక్షుమతీ ధరిత్రీ, యూపైర్విచిత్రాధ్వర వేదనాదైః ।
విభాంతి గావః పయసా విశిష్టాః, దుగ్ధాబ్ధిజే వర్షపతౌ శశాంకే ॥

చంద్రుడు రాజైనందున గోధుమలు-వరి-చెఱకు బాగుగ ఫలించును. గోవులు సమృద్ధిగ పాలిచ్చును.

### 2. గురోః మంత్రిత్వ ఫలమ్

శ్లో॥ దేశ క్షేమాభివృద్ధ్యర్థం, ప్రజాసౌఖ్యకరం యథా ।
సన్మంత్రిణో మంత్రయన్తి, గురౌ మంత్రిపదం గతే ॥

గురువు మంత్రి అయినందున దేశక్షేమాభివృద్ధి కొఱకు, ప్రజాసౌఖ్యమునకు మంత్రులు పాటుబడుదురు.





శ్లో॥ మౌంజీబంధే వివాహే చ, ప్రవేశే యజ్ఞకర్మణి ।
భరణీ కృత్తికా చైవ, న దోషా మండపాదిషు ॥

కర్తరిలో ఉపనయనము, వివాహము, గృహప్రవేశము, యజ్ఞయాగాదులును చేయవచ్చును.

## అథ మౌఢ్య నిర్ణయః

1. **గురుమౌఢ్యము** : వికృతి సంవత్సర ఫాల్గున బహుళ అష్టమి, 26-3-2011 తేదీ శనివారము నుండి, ఏతత్సంవత్సర చైత్ర బహుళ అష్టమి, 24-4-2011 తేదీ ఆదివారము వఱకు - పశ్చాదస్తమిత గురుమౌఢ్యము.
2. **శుక్రమౌఢ్యము** : ఏత త్సంవత్సర ఆషాఢ బహుళ దశమి, 25-7-2011 తేదీ, సోమవారము నుండి, భాద్రపద శుద్ధ పూర్ణిమ, 12-9-2011 తేదీ సోమవారము వఱకు - ప్రాగస్తమిత శుక్రమౌఢ్యము.

### గురు, శుక్రులకు వృద్ధత్వ, బాలత్వ దోషములు

గురు, శుక్రులు అస్తమించుటకు ముందు మూఁడేసి రోజులు వృద్ధులు గను, ఉదయించిన పిమ్మట మూఁడేసి రోజులు బాలురుగను నుందురు. ఈ కాలములను గూడ శుభకార్యములకు వర్జింపవలెను.

### మౌఢ్య వర్జ్యములు

గురు, శుక్రుల మౌఢ్యకాలములో బావులు, బోరింగులు, చెఱువులు త్రవ్వట; తోటపనులు, యజ్ఞములు, తీర్థయాత్రలు, పదవీ స్వీకారము, క్షౌరము, ప్రతిష్ఠలు, నూతన మంత్రానుష్ఠానము, దీక్షాస్వీకరణము, విద్యారంభము, అక్షరాభ్యాసము, తులాపురుషాది మహాదానములు, వివాహోపనయనాది శుభ కార్యములు చేయరాదు.

జనన గండదోష శాంతులు, గ్రహశాంతులు, వ్యాధి నివారణకై జప-హోమాది శాంతులు, గ్రహణ శాంతులు, రుద్రాభిషేక శాంతులు, రజస్వలా శాంతులు, ప్రాయశ్చిత్తాది శాంతులు, ఉత్పాత శాంతులును చేసికొనవచ్చును. గురుశుక్రులలో నొకరు అస్తమించగా మఱొక రుచ్చయందున్నచో, శుభకార్యములు చేయవచ్చును.

## అథ పుష్కర నిర్ణయః

ఈ సంవత్సరము వైశాఖ శు॥ పంచమీ, 8-5-2011 తేదీ ఆదివారము, పగలు గం.2-14 ని॥లకు **గంగానదికి** సార్ధత్రికోటిపుష్కర ప్రారంభము. ఇప్పటి నుండి 12 రోజులు పుష్కరదినములు.

ఈ నదీతీరవాసులు పుష్కర ప్రారంభము నుండి ఒక సంవత్సర కాలము వివాహోపనయనాది శుభకార్యములు చేయరాదు. ఇతర ప్రాంతములకు వెళ్ళి, శుభకార్యములను జరుపుకొనవచ్చును.

## పుష్కర విధులు

పుష్కరమనఁగా నేమి? పుష్కరమనఁగా పుణ్యకాలము. పుణ్యము చేసిన వారు సుఖాలను, పాపము చేసినవారు కష్టాలను అనుభవించెదరు.

సూర్యోదయకాలము నుండి మధ్యాహ్నము లోగా పుష్కరనదిలో స్నానము చేసి, బ్రాహ్మణులకు యథాశక్తి దానములు చేయవలెను. అపరాహ్ణకాలమున, అనఁగా మధ్యాహ్నము 1 గంట నుండి 4 గంటల వఱకు పుష్కరస్నానము చేసి, పితృదేవతల తృప్తికై శ్రాద్ధ-తర్పణ-దానములు చేయవలెను.

### పుష్కర దానములు

**1వ రోజున** : బంగారము, భూమి, వెండి, ధాన్యదానములు; హిరణ్య శ్రాద్ధము.

**2వ రోజున** : గోవులు, మణులు, వస్త్రములు, లవణ దానములు.

**3వ రోజున** : అశ్వము, బెల్లము, ఫలములు, శాకములు.

**4వ రోజున** : నెయ్యి, నూనె, పాలు, తేనె, పానకములు.

**5వ రోజున** : ధాన్యశకటము, నాగలి, ఎద్దు, మహిషములు.

**6వ రోజున** : కస్తూరి ఘనసార చందనౌషధములు.

**7వ రోజున** : గృహము, శయ్య, ఊయల, పీటలు.

**8వ రోజున** : శ్రీచందనము, కందమూలములు, పుష్పములు.

**9వ రోజున** : కన్యాదానము; దాసీ, కంబళదానములు; అన్నశ్రాద్ధము.

**10వ రోజున**: వెండి, ముత్యాలహారము, పుష్పములు.

**11వ రోజున** : అన్నవస్త్రములు, యజ్ఞోపవీతము, తాంబూలము, పుస్తక దానములు.

**12వ రోజున**: షోడశమహాదానములు, ఆమశ్రాద్ధము చేయవలెను.

### పుష్కరకాల ప్రమాణము

ఈ పుష్కరదినములు 12 రోజులలో నదీస్నానము చేయలేనివారు, పుష్కర దినములు గడచిన పిమ్మట, మధ్యాహ్నకాలమునందలి రెండు గడియలలో స్నానము చేసి దానములు చేసినచో, పుష్కరస్నాన ఫలము లభించును.





బాల, వృద్ధ, ఆతురులు (రోగులు) గ్రహణమోక్షణానంతరము, (వండుకొని) భుజింపవచ్చును.

రోహిణీ, మృగశీర్షా నక్షత్రజాతకులు ఈ గ్రహణమును చూడరాదు. యథావిధిగా శాంతి చేయించుకొనవలెను. అన్ని దేవాలయములను మధ్యాహ్న కాలమునకే మూసివేయవలెను.

**గమనిక** : ఈ గ్రహణముల ప్రారంభ, సమాప్తికాలములు, ఇతరత్ర చూపిన విధముగ, భారత కాలమానములోనే ఉన్నవని గ్రహింపవలెను.

### గ్రహణకాలే కర్తవ్యాఽకర్తవ్య నిర్ణయః

గ్రహణకాలమున ఆహారము తీసుకొనుట, నిద్రించుట, మైథునము, మూత్ర, పురీష విసర్జనములు చేయరాదు. గర్భిణీ స్త్రీలు కదలక పరుండవలెను. పాలు, పెరుగు, నెయ్యి, ఉప్పు, కూరగాయల పచ్చళ్ళలో దర్భ, లేదా గరికపోచ వేయవలెను. గ్రహణకాలమున స్నానము చేసి, యథాశక్తి గో-భూ-హిరణ్య దానములు చేసినచో పుణ్యము వచ్చును. ఈ పుణ్యఫలమే మానవుల వెంట వచ్చును గాని, గృహారామ ధనాదులు వెంట రావు. పొరుగు దేశములకు వలస వెళ్ళువారు, స్వగ్రామమున తమకు గల ఆస్తులను అమ్మి, ధనమును వెంట తీసుకొని వెళ్ళు రీతిగా, పై లోకములకు వెళ్ళునపుడు పుణ్య, పాప ఫలమును మాత్రమే తమ వెంట తీసికొనిపోవుదురు. శాస్త్ర వాక్యమును నమ్మి ఆచరించువాని జన్మ సార్థకము కాగలదు. "దాన్లో యేముందీ, దీన్లో యేముందీ?" అని ఒడ్డున కూర్చుని విమర్శించువాని జీవితము అటులనే నిరర్థకము కాగలదు. కావున ధర్మాచరణము శ్రేయోదాయకమని చెప్పబడినది.

గ్రహణకాలమున సాధకులు సంమీలనము నుండి ఉన్మీలనము వఱకు గాని, గ్రాసాది ముక్తి పర్యంతము గాని ఇష్టదేవతా జప, ధ్యానములు, హోమమును చేయవలెను. ఇతరులు (అర్హులు) గాయత్రీ జపము చేయవలెను. ఉన్మీలన కాలము నుండి మోక్ష కాలము వఱకు దానములు చేయవలెను. స్పర్శ, మోక్ష కాలముల పూర్వాపరములందు స్నాన మాచరింపవలయును.

### బింబదాన విధిః

వెండితో చంద్రబింబమును, బంగారముతో రవిబింబము, నాగప్రతిమను చేయంచి, వానిని ఆవునేతితో నింపిన కంచుపాత్ర యందుంచి తిల-వస్త్ర-దక్షిణలతో గ్రహణానంతరము బ్రాహ్మణునకు దానమీయవలెను. **అపుడు సంకల్పము :**

"మమ జన్మరాశి జన్మనక్షత్రాద్యరిష్టస్థాన సంభవిత సూర్యోపరాగ, అథవా సోమోపరాగ సూచిత సర్వారిష్ట శాంత్యర్థం, శుభఫలావాప్త్యర్థం బింబదానం కరిష్యే" ॥ తదాదౌ ధ్యానమ్ :

శ్లో॥ తమోమయ మహాభీమ ! సోమసూర్య విమర్దన ! ।
హేమతారా ప్రదానేన, మమ శాంతిప్రదో భవ ॥
విధుంతుద నమస్తుభ్యం, సింహికానందనాచ్యుత! ।
దానేనానేన నాగస్య, రక్షమాం వేధజాద్భయాత్ ॥
- ఏకాదశవారం జపేత్ ॥

# అథ మకర సంక్రాంతిః

## సంక్రాంతి పురుష లక్షణము

| సంక్రాంతి పురుషునకు |
|---|
| మహిష వాహనము |

శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం చైవ, చతుర్వక్త్రం త్రినేత్రకమ్
లంబకర్ణం రక్తదంతం, లంబభ్రూ దీర్ఘనాసికమ్ ।
అష్టబాహుం ద్విపాదం చ, వికృతం కృష్ణవర్ణకమ్
శతయోజన మౌన్నత్యం, విస్తీర్ణం ద్వాదశ స్మృతమ్
ఏవం రూపం చ విజ్ఞేయం, సంక్రాంతేః పురుషస్య తు ॥

ఏత త్సంవత్సర పుష్య బహుళ షష్ఠీ, **14-1-2012 తేదీ,** శనివారము, (సూర్యోదయాది ఘ.౪౫-౧౮) సూర్యాస్తమయాది ఘ. ౧౭-౨౨ విఘ॥లకు, రాత్రి గం.12-58 ని॥లకు భానోర్మకరరాశి ప్రవేశః । తత్త త్ఫలాని లిఖ్యన్తే ॥

సంక్రాంతి పురుషుఁడు రాక్షసనామకుఁడు - చండాలురకు నాశము. శుద్ధోదక స్నానము వలన సువృష్టి కలుగును. చర్మవసనధారణము - భూపతుల వలన బాధ. వసాగంధలేపనము - విషనాశము. నీలోత్పలధారణము - ఫలనాశము (పండ్లచెట్లకు నష్టము). విద్రుమభూషణము - దుష్టులకు నాశము. త్రపు (తగరపు) పాత్రధారణము - రోగప్రదము. దధ్యన్నము - తేజోహాని. తాళఫల ధారణము (తాటిపండు) - వృక్షములకు హాని. తోమరమను ఆయుధ ధారణము - యుద్ధభీతి. మయూరఛత్రము (నెమలికన్నుల గొడుగు) - మృత్యునాశము. మహిషవాహనము - జనులకు ఆకలిబాధలు. లోలముఖచేష్ట - వృష్టినాశము (అనావృష్టి). నివిష్ట అవస్థ (కూర్చొని యుండుట) - మధ్యార్ఘము గలుగును. వాయవ్య దిగ్యానము - వాయవ్య దిక్కునందున్న ఆఫ్ఘనిస్తాన్ మొదలగు దేశముల కరిష్టము.





**తిథ్యాది ఫలము :** బహుళపక్షమున సంక్రమణ మగుటచే జనులకు సుభిక్ష క్షేమారోగ్యములుండును. షష్ఠీతిథి-భయము, ధాన్యసమృద్ధి. శనివారము - వ్యాధులు, దుర్భిక్షము, చోరబాధలు. అపరరాత్రి కాలమున సంక్రమణ మగుటచే, కాకులకు హాని. తులాలగ్నము - జలప్రళయము (వరదలు). 24-వ ముహూర్తమున సంక్రమణము - పశుహాని.

**సంక్రాంతి పుణ్యకాలము :** 2012 సం॥ జనవరి 15-వ తేదీ, ఆదివారము మధ్యాహ్నము 2 గంటల వఱకు సంక్రాంతి పుణ్యకాలము.

## మకర సంక్రాంతి విధులు

శ్లో॥ రవి సంక్రమణే ప్రాప్తే, న స్నాయాద్యస్తు మానవః ।
సప్త జన్మసు రోగీ స్యాత్, నిర్ధనశ్చైవ జాయతే ॥

మనుష్యమాత్రునకు సంక్రాంతి సమయమున స్నానము విధింపబడినది. అట్లు స్నానము చేయని నరుడు యేడు జన్మములు రోగి, నిర్ధనుడును అగునని శాస్త్రవాక్యము.

శ్లో॥ యదన్నం సంక్రమే ప్రోక్తం, తదన్నైః ప్రీణయే ద్రవిమ్ ।
ఆయుధం యచ్చ తద్రాజ్ఞా, పూజనీయం జయార్థినా ॥

సంక్రాంతి పురుషుడు ధరించిన ఆయుధమును రాజులు అనఁగా అధికారములో నున్న రాష్ట్రపతి, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి మొదలగువారు పూజించవలెను. సంక్రాంతి పురుషుని యాహారముచే బ్రాహ్మణులను తృప్తిపఱచవలెను. సంక్రాంతి పురుషుడు ధరించిన ఆయుధము, వస్త్రాభరణ గంధపుష్పాదులు ధరించువారు నష్టపడుదురు. అట్టి వస్తువ్యాపారము చేయువారు యథావిధిగ శాంతి చేయించుకొన వలయును. సంక్రాంతి పుణ్యకాలమున శివునకు ఘృతాభిషేకము చేసిన మహాఫలము గలుగును.

అంతేగాక, సంక్రాంతి పుణ్యకాలమున నేయే దానములను చేయుదురో, అట్టి ద్రవ్యములను మఱు జన్మములందు సూర్య ప్రసాదమున బొందుదురని శాస్త్రవాక్యము:

శ్లో॥ సంక్రాంతౌ యాని దత్తాని, హవ్యకవ్యాని దాతృభిః ।
తాని తాని దదాత్యర్కః, పున ర్జన్మని జన్మని ॥

ఉత్తరాయణ పుణ్యకాలమున, నల్లనువ్వులచే స్నానము, తెల్లనువ్వులచే దేవతర్పణము; తిలదానము-తిలహోమము-తిలభక్ష్యమును చేయవలయును.

# కందాయ ఫలములు

కందాయ మనగా : కం - సుఖమును, దాయం - విభజించి యిచ్చునట్టిది; ఆకాశమునందున్నట్టి గ్రహ నక్షత్రాదులిచ్చు ఫలమని యర్థము. అశ్విన్యాది నక్షత్రముల వారికి ప్రథమ, ద్వితీయ, తృతీయ కందాయ సంఖ్యలు యీ దిగువ వ్రాయఁబడినవి:

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | భర | కృత్తి | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
| 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 |
| మఘ | పూ.ఫ. | ఉ.ఫ. | హస్త | చిత్త | స్వాతి | విశా | అనూ | జ్యేష్ఠ |
| 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 |
| మూల | పూ.షా. | ఉ.షా. | శ్రవ | ధని | శత | పూ.భా. | ఉ.భా. | రేవ |
| 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 |

శ్లో॥ ఆదిశూన్యే మహావ్యాధి, ర్మధ్య శూన్యే మనోవ్యథా ।
అంత్యశూన్యే ఽర్థనాశస్స్యాత్, త్రిశూన్యే నిష్ఫలం భవేత్ ॥

శ్లో॥ శూన్యేశూన్య మవాప్నోతి, కందాయస్య ఫలం విదుః ।
ఏకైకస్య చతుర్మాసం, కందాయానాం ఫలం వదేత్ ॥

ప్రథమ కందాయమున సున్న యున్నచో మహావ్యాధి, భయమును; ద్వితీయ కందాయమున సున్న యున్నచో మనోవ్యథ, ఋణమును; తృతీయ కందాయమున సున్న యున్నచో అర్థనాశము, హాని, దరిద్రమును సంభవించును. మూడు కందాయములు శూన్యములైనచో నిష్ఫలము. ప్రాణహానియు కలుగును. తద్దోష పరిహారార్థము యథావిధిగ శాంతి చేసికొనవలయును. బేసిసంఖ్య అర్థలాభము, సరిసంఖ్య సమఫలము.

ఈ సంవత్సరము మృగ, పుష్య, హస్త, ధనిష్ఠ నక్షత్రముల వారికి రెండు కందాయములలో సున్నలు వచ్చినందున, వారు యథావిధిగా (శాస్త్ర ప్రకారము) తమ తమ జాతకముల ప్రకారము శాంతులు చేయించుకొనవలయును. 'ఏలినాటి శని'దోషము గలవారు విశేషముగ శాంతి చేయించుకొనవలెను.





శ్లో॥ విషమేఽర్థలాభస్స్యా, త్సమేతు సమతా భవేత్ ।
శూన్యే తు శూన్య మవాప్నోతి, కందాయ ఫలమీదృశమ్ ॥

## ఆదాయ వ్యయములు

| రాసులు | ఆదా॥ | వ్యయ॥ |
|---|---|---|
| మేష, వృశ్చిక రాసుల వారికి | 14 | 2 |
| వృషభ, తులా రాసుల వారికి | 8 | 11 |
| మిథున, కన్యా రాసుల వారికి | 11 | 8 |
| కర్కాటక రాశి వారికి | 5 | 8 |
| సింహ రాశి వారికి | 8 | 2 |
| ధనుర్మీన రాసుల వారికి | 2 | 11 |
| మకర, కుంభ రాసుల వారికి | 5 | 5 |
| సర్వాదాయ వ్యయములు : | 53 | 47 |

## రాజపూజ్య, రాజాఽవమానములు

| రాశిః | పూజ్య॥ | అవ॥ | రాశిః | పూజ్య॥ | అవ॥ |
|---|---|---|---|---|---|
| 1. మేషస్య | 4 | 5 | 7. తులాయాః | 1 | 7 |
| 2. వృషభస్య | 7 | 5 | 8. వృశ్చికస్య | 4 | 7 |
| 3. మిథునస్య | 3 | 1 | 9. ధనుషః | 7 | 7 |
| 4. కర్కటకస్య | 6 | 1 | 10. మకరస్య | 3 | 3 |
| 5. సింహస్య | 2 | 4 | 11. కుంభస్య | 6 | 3 |
| 6. కన్యాయాః | 5 | 4 | 12. మీనస్య | 2 | 6 |

శ్లో॥ రోగాఽరోగ్యౌ పుణ్యపాపౌ, లాభాఽలాభౌ జయాఽజయౌ ।
సుఖదుఃఖే వృద్ధిహీనే, వాఽఽదాయ వ్యయసంజ్ఞికౌ ॥
రోగాఽరోగ్యే వృద్ధి హీనే, ధనాఽగమన నాశనే ।
మేషా ద్యేకాధిపత్యే తు, నిర్ణేయమితి సూరిభిః ॥

పైని చెప్పఁబడిన సంఖ్యలవల్ల ఆదాయ, వ్యయములేగాక, లాభనష్టములు, సుఖదుఃఖములు, వృద్ధిహీనములు, ధనప్రాప్తి, ధననష్టము, రోగము, అరోగము (ఆరోగ్యము), పుణ్యపాపములు, జయాఽపజయములు, మానాఽవమానములను గురించి తెలిసికొనవచ్చును.

## అగస్తి పూజనము

ఈ సంవత్సరము అగస్త్య నక్షత్రము, వైశాఖ బహుళ ఏకాదశీ, 28-5-2011 తేదీ, శనివారము పగలు గం.12-24 ని॥లకు (హైదరాబాద్ గణిత కేంద్రముగా) అస్తమించి, మఱల శ్రావణ బహుళ తదియా, 16-8-2011 తేదీ, మంగళవారము రాత్రి గం.1-46 ని॥లకు ఉదయించును.

అగస్త్య నక్షత్రము పగటికాలమున అస్తమించి, రాత్రికాలమున అందును వర్షాకాలమునం దుదయించుటచే, సర్వధాన్యవృద్ధి కలిగి, దేశము సుభిక్షముగ నుండును. (సుభిక్షమనఁగా సులభభిక్షము గలది).

అగస్త్య నక్షత్రము యొక్క యుదయాస్తమయ కాలములందు సూర్యునకు వలె అర్ఘ్యప్రదానము గావించి, అగస్త్యుని పూజింపవలెను. అంతేగాక, ఆదిత్య హృదయాది స్తోత్రములను పారాయణ గావింపవలెను. అట్లు చేయువారికి ఆరోగ్య, ఐశ్వర్యములు లభించును.

**అగస్త్యేశ్వరాలయము :** ఆంధ్రప్రదేశ్ కడప జిల్లాలో ప్రొద్దుటూరు పట్టణపు నడిబొడ్డున అగస్త్యేశ్వరాలయము గలదు. అందు, అగస్త్యుని యుదయాస్తమయ కాలములలో పూజాదికము నిర్వర్తింపవచ్చును.

## స్నానమును చేయునపుడు ధ్యానము

"శ్లో॥ హరి ర్నారాయణో గంగా, గంగా నారాయణో హరిః ।
హరి ర్విశ్వేశ్వరో గంగా, గంగా విశ్వేశ్వరో హరిః ॥"

అని చెప్పుచు, సూర్యోదయాత్పూర్వము (నీటియందు విద్యుచ్ఛక్తి ఆవరించి యుండు కాలమున) స్నానమును చేయుట తేజస్కరము.

"శ్లో॥ గంగేచ యమునే కృష్ణే, గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి, జలేస్మిన్ సన్నిధింకురు ॥
గంగా గంగేతి యోబ్రూయా, ద్యోజనానాం శతైరపి ।
ముచ్యతే సర్వపాపేభ్యో, విష్ణులోకం సగచ్ఛతి ॥
నందినీ నలినీ సీతా, మాలినీ చ మహాపగా ।
విష్ణుపాదాబ్జసంభూతా, గంగా త్రిపథగామినీ ।
భాగీరథీ భోగవతీ, జాహ్నవీ త్రిదశేశ్వరీ ।
ద్వాదశైతాని నామాని, యత్ర యత్ర జలాశయే ।
స్నానకాలే పఠే న్నిత్యం, మహాపాతకనాశనమ్ ॥"





ప్రచురణ సంస్థలు, ట్రాన్స్‌పోర్ట్ కమ్యూనికేషన్సు వ్యవస్థ నూతన సాంకేతిక పరిజ్ఞానముతో వృద్ధిలోనికి వచ్చును. కేతుస్థితి వలన, అమెరికా దేశమునందు మతఛాందసులవల్ల అల్లర్లు లేదా విధ్వంసములు గలుగు సూచనలున్నవి. ఈ సందర్భములో 2011 సం॥ ఆగస్ట్ 25వ తేదీ ప్రాంతము శుభప్రదముగాదు. అటులనే అక్టోబర్ 3-వ తేదీ ప్రాంతము దేశారిష్టయోగము. ప్రభుత్వధనము దుర్వినియోగమగును. ప్రజలకు చోరాగ్నిబాధలు, పడవలు మునుగుట మొదలగు అరిష్టములు సూచింప బడుచున్నవి.

వర్షలగ్నము కర్కాటకమైనందున, ప్రభుత్వాదాయము నిలకడగా నుండదు. షేర్‌మార్కెట్‌లో ఒడుదొడుకులు అధికముగా నుండును. శనిస్థితివల్ల రైల్వే, పోస్టల్, ట్రాన్స్‌పోర్ట్ సంస్థలందు సమ్మెలు, ప్రమాద ములు మొదలగునవి జరుగు సూచనలున్నవి. ఈ సందర్భముగా అక్టోబర్ 13-వ తేదీ ప్రాంతము శుభప్రదము గాదు.

గురు, శుక్రుల ఉదయాస్తమయముల ననుసరించి ఉగాది నుండి ఏప్రిల్ నెలాఖరు వరకు వివాహసుముహూర్తములు లేవు. మరల, జూలై 20-వ తేదీనుండి అక్టోబర్ 6-వ తేదీ వఱకు వివాహ సుముహూర్తములు లేవు.

ఈ సంవత్సరము వర్షములు విస్తారముగా కురియును. ఆగస్ట్, సెప్టెంబర్ నెలలలో అధిక వర్షములు, తుఫానుల వల్ల పశువులకు పంటలకు హాని, జననష్టమును కలుగును. గ్రీష్మసస్యముల కంటె శరద్ధాన్యములు బాగుగా పండును. ధరలు నిలకడగా నుండును. రసాధిపతి చంద్రుడైనందున ఫలసమృద్ధి యుండును. కాని, గృహోప కరణములకు, ఇతర సామాగ్రికిని ధరలు హెచ్చును. గురువు మంత్రి అయినందున, ప్రభుత్వము కఠినముగా వ్యవహరించి, ఆర్థిక కుంభ కోణములను వెలికిదీసి, ఆర్థికవ్యవస్థను పటిష్టము చేయును. ప్రభుత్వా దాయము అనేకరీతులుగా వృద్ధి చెందును

ఈ సంవత్సరము భారతదేశములో రెండు చంద్రగ్రహణములు

కన్పించును. ఒకటి జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ, జూన్ 15 బుధవారము రాత్రి; రెండవది మార్గశిర శు॥ పూర్ణిమ, శనివారము రాత్రి. గ్రహణములు ఏ దేశములలో సంభవించినను, గ్రహణ నక్షత్రములలో పుట్టినవారికి అరిష్టములు గలుగును కావున యథావిధిగా శాంతి చేయించుకొనుట మంచిది.

ఈ సంవత్సరము మకరసంక్రాంతి పురుషునకు మహిష వాహన మైనందున, దున్నపోతులకు, గేదెలకును రోగబాధలు కలుగును. వైశాఖ శుద్ధ పంచమీ, మే నెల 8-వ తేదీన గంగానదికి పుష్కర ప్రారంభము. ఈ సంవత్సరము నాలుగు తూముల వర్షము, 13 వీసముల పంట పండును.

శుభం భూయాత్॥

## స్వస్తివాచకము

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్,
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితః, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥

శ్లో॥ అపుత్రాః పుత్రిణ స్సంతు, పుత్రిణ స్సంతు పౌత్రిణః ।
అధనా స్సధనా స్సంతు, జీవంతు శరదాం శతమ్ ॥

మం॥ స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతి ర్దధాతు ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాన్తిః ॥

శ్లో॥ అన్నపర్త్యన్వయాంభోధి రాకాపూర్ణ సుధాంశునా ।
ప్రోక్తం భాస్కర పంచాంగం, విదుషా కృష్ణశర్మణా ॥

శ్లో॥ బద్ధ పృష్ఠ శిరో గ్రీవః, స్తబ్ధదృష్టి రథోముఖః ।
కష్టేన లిఖితం గ్రంథ, మాద్రియన్తు విచక్షణాః ॥ (అ.కృ.శ.)

పైకి మాత్రమే 'డెమోక్రసీ'; అందరూ కోరుకునేది 'డిక్టేటర్‌షిప్పే'.



## వివాహ సుముహూర్తయోగ్య తిథినక్షత్రాదులు

**శుభ నక్షత్రములు :** రోహి, మృగ, మఘ, ఉ.ఫ., హస్త, స్వాతి, అనూ, మూల, ఉ.షా., ఉ.భా., రేవతి (11 శుభ నక్షత్రములు).

**కన్యావరణమునందు :** శ్రవ, పూ.ఫ., పూ.షా., పూ.భా., ధని, కృత్తిక నక్షత్రములు గూడ పనికి వచ్చును.

పైని చెప్పిన రోహిణ్యాది నక్షత్రములు (1) బ్రాహ్మము, (2) దైవము, (3) ఆర్షము, (4) ప్రాజాపత్య వివాహములకు పనికివచ్చును. శేషించిన, (5) అసురము, (6) గాంధర్వము, (7) రాక్షసము, (8) పైశాచికములను వివాహములకు - పైని చెప్పిన 11 శుభనక్షత్రములేగాక, అదనముగ : అశ్వి, చిత్ర, శ్రవ, ధనిష్ఠలు గూడ పనికివచ్చును.

**స్త్రీపునర్వివాహమునకు,** అనగా ఘర్షణము, ఖండమంగళము (ఖడ్గ వివాహమైన కన్యకు భర్త మరణించినచో, పునర్వివాహము)నకు - అశ్వి, చిత్ర, శ్రవ, ధని, పుష్య, పూ.ఫ. - ఈ ఆఱు నక్షత్రములు గూడ చెప్పఁబడినవి.

**నిషిద్ధ తిథ్యాదులు :** రిక్తతిథులు (౪, ౯, ౧౪), ద్వాదశి, అమా, అష్టమి, షష్ఠి తిథులును; పరిఘ పూర్వార్ధము, వ్యతీపాత, వైధృతి యోగములు, భద్ర (విష్టి) కరణము, అవమ, అర్ధరాత్రి, యుగాదులు, మన్వాదులును వివాహమునకు నిషిద్ధములు. శుద్ధ పాడ్యమి వివాహమునకు నిషిద్ధము.

శూన్యమాసములు, మాసశూన్యనక్షత్రములు, గురు శుక్ర మౌఢ్యము లును వివాహమునకు నిషిద్ధములు.

ఏకవింశతి మహాదోషములను పరిహరించి, అష్టమశుద్ధి మొదలగు ఇతరాంశములను చూచుకొని వివాహలగ్నమును నిర్ణయింపవలెను.

### బాల వైధవ్యయోగ పరిహారము

కన్యక జాతకమునుబట్టి బాలవైధవ్యయోగ ముండెనేని ఆ కన్యకయొక్క తండ్రి ఆ కన్యక చేతనే సావిత్రీవ్రతమును గాని, పిప్పలవ్రతమును గాని చేయించి ఆ కన్యను విష్ణుప్రతిమ అశ్వత్థఘటములకు రహస్యముగా నిచ్చి వివాహమును చేసి చిరంజీవియైన వరునికిచ్చి వివాహము చేయవలయును. అట్లు రెండుమార్లు పెండ్లి చేసినందున ఏ దోషమును లేకపోవును.

చిక్కించుకునే చిక్కం అల్లేవాడి చేతిలో ఉంటుంది.

